# సంఘసంస్కరణము

ఇ. సీతారామరావుగారు, ఎం ఎస్సి

స్వయంకృత్రిమ ఆదర్శప్రాయమగుసంఘము ఏకాలమునందును ఎన్నటనుండదు. సంఘమందలిలోపములను సవరించుకొను ప్రయత్నమే సంఘసంస్కరణము.

క్రైస్తవమహమ్మదీయాది మతస్థులతో నాకిచ్చట ప్రసక్తిలేదు అవిషయమై చర్చింపబూనినచో గిచ్చపోవను ఇదలించవలయును. ఈవ్యాసమున హిందూ సంఘసంస్కరణము నిమిత్తమైయే కొంతవ్రాయదలచినాను.

నియమములను, లేక కట్టుబట్టులను, రెండువిధములుగ విభజింపవచ్చును. మతసూత్రములు, సాంఘికనియమములు, వ్యక్తిపరముగను సజ్జనగను, మానవాభ్యున్నతికి, పరిపక్వమునకుతోడ్పడునవి. మతసూత్రములు నానిత నిత్యత్వమకజము అవిమారునవికావు. పత్యమతేముల న్నియు వానినేబోధించును, వానివిషయమై వివాదమునకు అభిప్రాయభేదముండదు.

మతసూత్రముల పవిత్రమునై, వానికిసమన్వయముకలుగునట్లు సహింపవలెను. సాంఘికనియమము లేర్పడవలయును. వీనిలో కాలకనుగుణముగాను మానవజాతికంతటను, సర్వదేశములకును వర్తించునవిగనుండును. కొన్ని దేశకాలపాత్రములనుబట్టి మారుచుండును. ఇట్లుమారవలసిన నియమములను మార్చుటయు' సుహృదభిప్రాయములకు వ్యతిరేకముగనుండి, దేశాభివృద్ధికి ఆటంకకరములుగనుండు మూఢనమ్మకములను, ఆచారములను తొలగించుటయే సంఘసంస్కరణము.

సంస్కరణమునకొరకు ప్రథమవిషయము అస్పృశ్యత.

## అస్పృశ్యత

హిందూసంఘమునందు ఇంచుమించుగ నాల్గవవంతు అస్పృశ్యు లనబడువారిగ్రసియున్నది. వీరు అగ్రజాతులచేత నీచముగ చూడబడుచున్నారు. గ్రామములకు దూరముగవీరు నివసింతురు, అగ్రజాతులవఒడు వారుపయోగించుకొను బావులను, దేవళములను, స్నానఘట్టములను, ఇతరస్థలములను ఉపయోగింపరు.

ఇట్టిఅస్పృశ్యతవలన హిందూమతమునకు తీవ్రనష్టము కలుగుచున్నదని వేరుగ చెప్పవలసినపనిలేదు. దీనిని మతసూత్రముగా పరిగణించి, ధర్మశాస్త్ర సాహాయ్యమువలన దీనిని సమర్థింపబూనుట వ్యర్థప్రయత్నము. మతమెన్నటికిని అస్పృశ్యతాతత్వమును బోధింపదు. కావున మనమందరము ఈదురాచారమును నిర్మూలించుటకై పాటుపడవలయును.

ఇటీవలనే తిరువాన్కూరు మహారాజుగారు తమయధికారమునకులోబడిన దేవాలయములన్నిటియందును సవర్ణావర్ణులు, స్పృశ్యాస్పృశ్యులు నిరాఘాటముగ ప్రవేశించి పూజాదికములు జరుపవచ్చునని అజ్ఞ ఇచ్చినారు. ఇదిమెచ్చుకొనదగినవిషయము. బ్రిటీషిండియాయందును, స్వదేశసంస్థానములయందును ఇట్టిశాసనములు బయలుదేరవలయును. శాసనమూలమున సంఘసంస్కరణము సాగించుట సాధ్యమగునని నానమ్మకము. ప్రజాప్రతినిధి ప్రభుత్వములలో, ఇట్టిసంస్కరణవిషయికశాసనములు కష్టముమీదనే బయలుదేరును కాని సర్వతంత్రస్వతంత్రులగు ప్రభువులుగల స్వదేశసంస్థానములలో ప్రభుత్వమువారిట్టి శాసనములను సులభముగ చేయవచ్చును.

"[అ] ప్రజోపయోగమునకై వినియోగించుటకు ఉద్దేశింపబడిన దేవళములు, పాఠశాలలు, బావులు, చెరువులు, స్థలములు మొదలగు ప్రాంతములందు కులభేద లేక అందరును ఉపయోగించవచ్చును ఎవరికిని, ప్రత్యేకకారణము లేక ఆటంకము కల్గింపరాదు."

"[ఆ] అస్పృశ్యులనబడువారు సర్వసాధారణముగ ఈకాలమున గ్రామములకుదూరముగ గూడెములలో నివసించుచున్నారు. ఈపద్ధతి అస్పృశ్యతానివారణమునకు గొప్పఆటంకముగానున్నది ఇట్టిపద్ధతినిమాపుటకై ఇతరవర్ణముల వారితోపాటు వీరును నివసించు నేర్పాట్లు చేయవలయును గ్రామకేంద్రపుహద్దులలోనే వీరును నివసించు నిబంధనము జరుగవలయును"

పైనసూచించబడిన రెండుశాసనములను ప్రభుత్వమువారు అమలునకు తీసికొనిరాగలిగినచో అస్పృశ్యతత్వరలోనే అంతరించును. విద్యా సాంఘిక, రాజకీయాభివృద్ధి వెనువెంట నేసమకూడును

## స్త్రీలు

సంస్కరణావశ్యకమగు విషయములలో స్త్రీల స్థితియు ముఖ్యమైనదే

మతవిషయమునను, సాంఘిక ఆర్థిక రాజకీయ విషయములను, స్త్రీకి తగుస్థానము ఈయబడుటలేదు దీనివలన సంఘమునకు పెక్కునష్టములు వాటిల్లుచున్నవి.

తలిదండ్రులు తమ స్త్రీపురుషసంతానమును సమానముగ చూచుకొనవలయును, ఆస్తివిషయమునను, విద్యనేర్పుచుటయందును ఇరువురకును సమానముగు అవకాశములనీయవలెను. గోషాపద్ధతి పూర్తిగతొలగిపోవలయును.

వేయేల,మత, సాంఘిక, ఆర్థిక, రాజకీయవిషయములలో స్త్రీకి తగినస్థానము లభింపవలయును.

## వివాహవిషయిక సంస్కరణములు

వివాహము కేవలము మతవిషయమనియు, దానివిషయమై ఎట్టిశాసనములను జేయుటయు సమంజసముకాదనియు కొందరువాదింతురు. వివాహము మతసంబంధమగు చర్యకావచ్చును. కాని 'ఎట్టివయస్సున వివాహము చేసికొనవలయును' అనువిషయమై అభిప్రాయభేదముండవచ్చును. ఏదిఎట్లున్నను హరవిలాసశారదాగారి ప్రయత్నములఫలితముగను, లార్డుఇర్విను సానుభూతికి సూచనగను, బాల్యవివాహనిషేధశాసము బ్రిటీషుఇండియాయందు చట్టరూపము దాల్చినది. ౧౪ సంవత్సరములకు లోబడినకన్యలును, ౧౮ సంవత్సరములకులోబడిన బాలురును వివాహమాడకూడదని శాసనము నియమించుచున్నది. ఇట్టిశాసనము మనరాష్ట్రమునందును ఏర్పడుటకై ప్రయత్నములు జరుగవలయును.

వితంతూద్వాహమునుగురించియు శాసనము బ్రిటీషిండియాయందును. కొన్నిస్వదేశసంస్థానములందునుగలదు అట్టిదిమనకును అత్యవసరమే.

ఇంతయేగాక వివాహసమయములందలి దుర్వ్యయములనుగురించియు, ఇట్టివియేయగు ఇతరసందర్భములనుగురించియు శాసనములు కావింపబడవలయును.

## భోజన ప్రతిభోజనములు

సంపంక్తిభోజనములు మనలోఎక్కువగా ప్రబలవలెను. శాకాహారభోజనముల ఏర్పాటుచేసినచో ఇదిసులభముగ నెరవేరును, దీనివలన భ్రాతృభావమును, ఐకమత్యమును వృద్ధిచెందుటయేగాక ఎన్నిమోక్షపసమస్యలు పరిష్కారములగును

—



# పరితాపము

మిత్రగుప్తుడు

దక్షిణ ఆఫ్రికాయందలి పార్లమెంటులో రిపబ్లికను నేషనలిస్టు పార్టియొక్క లీడరగు డాక్టరు మలాన్ బ్రేమె ఇండియన్ ఒపీనియన్ యను పత్రికారాజములో తనసానుభూతిని ప్రకటించుచు నొక వ్యాసమును వ్రాసియున్నాడు. అందలిసారాంశమిటు వ్రాయబడుచున్నది.

హిందూదేశ ప్రస్తుతపరిస్థితులతిలకించి నేనిపుడు మొదటికంటె అధికముగ బ్రిటను సామ్రాజ్యాధిపత్యమును వ్యతిరేకించుచున్నాను అంగ్లేయులు తమ మాతృదేశ లాభాశయమునకై భారతదేశమును పీల్చి పిప్పిచేయుచున్నారు, ఈవిధానమువలన భారతీయులచెంతనుండి ఒ మాత్రము మిగిలిపోయినవిశ్వాసము మరియు బీదతనము మరింతహెచ్చినది.

ఈవిధానమునందు, అంగ్లేయులు మొగలియా ప్రభుత్వవిధానము ననుకరించుచున్నారు.నూటికి డెబ్బదిభారతీయులు తినకూడులేక యల్లాడుచుండ, ఢిల్లీనిమాత్రము నూతనముగ నిర్మించుటకు లక్షలరూపాయలను వ్యయపరచియున్నారు. అంతియాకాక మప్పదికోట్లప్రజలు విద్యావిహీనులై పశువులుగా జీవనయాత్ర సాగించుచున్నారు.

దక్షిణ ఆఫ్రికాయందలి ప్రాచీన పటుంబములు, నిస్సంశయముగ పేదలిదేశములోని నూటికి తొంబదిమందికంటె మేలైన స్థితిలోనున్నారు. బొంబాయి కలకత్తవంటి గొప్పసుప్రసిద్ధపట్టణములలో వేలకొలదిప్రజలు రాత్రులందు వీధులలో నిద్రించుచుందురు. ఏలనన యుండుటకు వీరికికొంపలైననులేవు, నేనువీధులలో సంచరించునప్పుడు, వీరుపరుండ,వీరినిదాటిపోవుట నాకుకష్టమనిపించెడిది అప్పుడప్పుడు నాపాదము వీరికితగులుచుండెడి.

దారిద్ర్యమునకుమేరలేదు, నూటికి తొంబదిజనులు అఖండబీదతనమునందు మునిగి తేలుచున్నారు, జనులెక్కువగ చాలీచాలని గడ్డిగుడిసెలలో తలదాచుకొందురు. ఆరుజరోగ్యమునకుగావలసిన ప్రాథమిక సౌకర్యములైనను లేవు. మొత్తముగవిచారించిన ప్రతిభారతీయుని నిత్యదినసంపాదన రెండు పెన్సులని ఇండియను నేషనల్ కాంగ్రెస్ ప్రకటించినది, ఆఫ్రికాలోనుండు భారతీయులు ఎంత నిర్బంధింపబడినను, వీరుభారతదేశమునకు మరలిపోవుటయను ట దుర్లభము. ఆఫ్రికా నుండి భారతదేశమునకు మరలినవారు పశ్చాత్తాపపడుచున్నారు, అందరిపెక్కుజనులు మరలఆఫ్రికాకువచ్చుటకు,అనుమతిని ప్రసాదించుటకై విన్నపములు చేయుచున్నారు భారతీయులను ఆఫ్రికానుండితీసివేయుటకు వివాదించుటకుముందు వీరిక్షేమము నరయుటయే మొదటిప్రశ్న

భారతదేశ భవిష్యత్తునుగూర్చి కొంతనుడువవలసియున్నది. యూహింపతగినంతవరకు, బ్రిటిషుసామ్రాజ్యము చివర నాట్యరంగమును ప్రవేశించినది. హిందూదేశములో జయింపలేని దేశద్రోహముపొడసూపినది. మహాత్మా గాంధీయొక్క అధిపత్యము, తొలగిపోవునని తలంచుట ప్రమాదము. వీరివ్యక్తిత్వమునెంతయు నాదర్శప్రాయమని సాంప్రదాయముగ భారతీయులు దృఢముగ నభిప్రాయపడుచున్నారు. అతనినో

[౧౦వ పేజి చూడుము]

# తెలంగాణా వార్తలు

## గాలిఉప్పెన రాలవాన

[విలేఖరి]

(జన్గాంతాలూకా) ౯ ౧ ఖుర్దాదు జేడికల్లు, గొలనకొండ, గుముడవెల్లి, వెల్మజాల, మొదలైన గ్రామాదులపై ఫాల్గునబహుళ ఆదివారము సాయంత్రము ౫ గంటలసమయమున రాలవానగురియుచుండగా దానివెంట పెద్దగాలికూడావచ్చి కొన్ని చెట్లకొమ్మలు విరిచి మొద్దులుచేసెను- కొన్ని నోట్ల వక్కలువక్కలుగా చీల్చివేసెను-కొన్ని చెట్లకూకటి వేళ్లతో పెళ్లగించి దూరదూరము పారవేసెను ఈఉప్పెనలో లక్షలకొలది చిన్నపెద్ద చెట్లేగాక పట్టిమొద్దులుకూడా పెకలింపబడెను. చెట్లుగాలి యెన్నియోపశువుల అంగములువిరిగెను,కొన్ని వెంటనే మరణించెను కొందరు మనుష్యులు కూడా పశువులగతిపొందిరి. వడగండ్లు ఒకప్పుడు కొన్ని మామిడికాయలంతగూడా పడెను రాళ్ళదెబ్బలలో చెట్లు విరుగుచుండగా గుడిసెలు ఎగురుచుండగా పిల్లలు పెద్దలు గడగడ వడకుచుండిరి. ఫాల్గుణమాసము నుండి కుంభవర్షములుగురిసి పంటలు నష్టమైనవి. పల్లెలయందు జ్వరములు మొదలగువ్యాధులు వ్యాపించుచున్నవి. నేలయంతట పచ్చబడినది కాని పశువులకుమాత్రము మేతదొరకుటలేదు. వ్యవసాయకుడు వ్యాకులపరంపరలో చిక్కినాడు, పరమాత్మ యతనికి శాంతినొసంగుగాత.

## చిరుతపులి మరణము

కన్వటు, ఆర్దిబెహష్తు ౩౧:-

ఈప్రాంతములో చిరుతపులులు మిక్కిలిగా గాగలవు ఇటీవలనే సర్దారుఖావనుసతడు అడవిలోనుండిపోవుచుండగాఒకచిరుతపులి ఆతనిపైకివచ్చెను. అదృష్టవశాత్తున ఆసమయమున అతనివద్ద తుపాకియుండినందున వెంటనే గుర్పెట్టికాల్చివేసెను.

బోధ్ తాలూకా గ్రామమునకు రెండుమూడుసంవత్సరములనుండి ఒకచిరుతపులివచ్చి మనుష్యులచంపుచున్నది. గతసంవత్సరములో ముగ్గురిని, ఈసంవత్సరములో ౧౨ మందిని మారణముగావించినది. ఈమృగము ఎక్కడినుండునో ఎవరికి అంతుదొరకకుండుటవలన ఎవరును వేటాడుటకు వలనుపడుటలేదు.

## రైలుప్రమాదపు విచారణతీర్పు

పోయినఇస్ఫందారు నెల ౧౨ వతేదినాడు షాదునగరు తిమ్మాపూరులమధ్య ఒకఖాళీఇస్పు రైలుబండితోఢీకొనుటచే ౯ మంది మరణించుటయు, మరి ౧౧మందికి గాయములగుటయు తెలిసినవిషయమే దానిని విచారణచేయుటకై పెంకుహాయలో సెం- ౭ వక్కలులో ప్రభుత్వమువారి సీనియర్ రైల్వేఇన్స్పెక్టరుగనుండువారువచ్చి మొటారుడ్రైవరు తప్పతాగి ముందుగా ఎంతహెచ్చరికచేసినను వినక రైలువచ్చుచున్నను నిరోధ్ధాటబోవుటచే నీప్రమాదము జరిగెనని తీర్పుచెప్పిరి- కాని అక్కడి రైలుమార్గముపై పెద్దమార్గముకలియుచోట ఒడ్లను రైలువచ్చుసమయమున అప్పటకు గట్టిఏర్పాటుకూడలేదని గ్రహించుటేడినది- విచారణ ప్రమాదముజరిగిన మరుసటిదినమేజరిగెను- నైజాం రైల్వే ఏజంటుఅసు స్లాటర్ గారును, జిల్లాకళాఖాధకారి హాలిన్సు గారును, హైదరాబాదు రైల్వేపోలీసు సూపరింటెండెంటుడగ్లస్ గారును విచారణసమయమున నుండిరి-

## గ్రామమంత భస్మమైనది

ఆసిఫాబాదు, ఆర్దిబెహష్తు ౨౯:

ఈజిల్లాలో చేరిన కన్వటు తాలూకాలోని గుల్గ్రామమనుచోట ఆర్దిబెహష్తు ౨ నాడు మధ్యాహ్నము సరియైనగాలివీచి ఒకయింటికి నిప్పంటుకొని ఆనిప్పు గ్రామమెల్ల వ్యాపించెను. గ్రామమంతయు వీకముఖమున కాలుచుండెను. సుంకపు శాఖ నాకా కార్యాలయములో మొత్తమురికొన్ని నగదుడబ్బుతోసహా కాలిపోయినది. పగటివేళ అయియుండుటచే ఇండ్లయందునుకూడా ఎవరులేకుండిరి, సాయంత్రము చాలాప్రయాసమై ఆరినది. పశువులు కూడా అడవియందే యుండినందున ప్రాణనష్టము జరిగియుండలేదు, గ్రామప్రజలు పైబట్టలతో మిగిలియున్నారు.

## సిద్దిపేటలో ప్లేగు

మెదకుజిల్లాలో చేరిన సిద్దిపేట తాలూకా గ్రామములో చాలాచోట్లు ఎలుకలు పడుచున్నట్లును, అందుచే ఇండ్లను వదలివేయుచున్నట్లును తెలియుచున్నది. ఇంతేగాక, స్ఫోటకము, మరియు జ్వరములుకూడా కలవు.

ఆర్దిబెహష్తు ౨౮:-

గలవారమునుండి ఆనగా వర్షములు కురిసిపోయి, ఎండలు తీవ్రముగా నున్నప్పటినుండి గత్తరతన ప్రభావమును చూపుచున్నట్లును నివారణ పదుపాయములు చేయుచున్నట్లును తెలియుచున్నది యింకా కొన్ని జిల్లాలనుండి ఇట్లే వార్తలువచ్చుచున్నవి.

## పులివేట

ఆసిఫాబాదు, ఆర్దిబెహష్తు ౩౧:-

కొలదిదినములక్రితము నవాబు మొయునొద్దౌలాబహాదరుగారు వేటాడుటకు ఆదిలాబాదు విజయముచేసియుండిరి. వీరు మూడుపులులను వేటాడిరి. ఆర్దిబెహష్తు ౨౨ వతేదినాడు మేజరు జి, వి పటక్ మరియుమేజరుడబ్ల్యూ. గార్లు వేటనిమిత్తమైవచ్చి సిరిపూరు ముసాఫరు బంగ్లాలో బసచేసి ౨౮ వతేదినాడు ఓంటుపల్లిచుట్టుప్రక్కలలో ఒకపులిని వేటాడిరి. దీని పొడవు ౧౦ అడుగులకు మించియుండెను.

## మరట్వాడావార్తలు

## పాదిరీలపై ముసల్మానుల మొఱలు

ప్రభుత్వమువారికి

లాతూరు, అర్దిబెహస్తు ౩౦.—

లాతూరుగ్రామ మహమ్మదీయులు ప్రభుత్వోద్యోగులకీక్రిందివిధమున నొకవిజ్ఞప్తిని పెట్టుకొనిరి:—

"పోలీసుకార్యాలయమునకు వెనుక మహమ్మదీయుస్మశానవాటికలో పాదిరీజాతివారు ఉంటూఉన్నారు. వారియందు గృహముల ఏర్పరచుకున్నారు. వారిపిల్లలు మలమూత్రములు వదలుచుందురు. ఇందేగాక మస్తుపదార్థములను కూడా ఉపయోగమునకు తెచ్చుచుందురు. ఈ స్మశానభూమిసమీపమునుంచి అధికారులు వచ్చుచుందురు." విజ్ఞప్తి ఫలితమింకను తేలలేదు.

## లోభికి వ్యయమెక్కువ

నారాయణఖేడు, అర్దిబెహస్తు ౩౦ —

నారాయణఖేడు నుండి నిజాంపేటవరకు పాయిగాపక్షమున మొరమురోడ్డు వేయపడుటకై ౧౩ వేలరూపాయలు అంగీకరించియున్నారు. ఈరోడ్డు సుమారు ౧౦ మైళ్ళుండును. ప్రదేశమంతయు ఇసుకగానుండును. మార్గమధ్యముల నొక కాలువయుండుటచే ఒక చిన్నవంతెనకూడా నిర్మింపబడును. కొన్ని సంవత్సరముల క్రితము ఈరోడ్డువకుగాను ౧౬-వందలరూపాయలుమాత్రము చాలునని తలచబడి తర్వాత వేరేవక్షానొకదానిని సిద్ధపరచి ౫ వేలు అవసరమని అంగీకరించి సంజీవరావుపేట దేశముఖుగారి పరము చేసిరి. పనికూడా నెరవేర్చిరి. నిర్మాణానంతరము ఒకసామాన్యవర్షమునకే పైనున్నంత కొట్టుకొనిపోయి గండ్లేర్పడెను. అందుచే తిరిగి ఆవేసడమునకుగాను ౧౩ వేలు అంగీకరించబడి ఈనిర్మాణము ఉప్పల్ పట్వారియగు వెంకన్నగారిపై బడినది.

### కల్యాణి (జాగీరు) వార్తలు

కల్యాణి, అర్దిబెహస్తు ౨౯:—

ఈగ్రామములో నిజాంప్రభువుగారి రజతోత్సవచిహ్నముగ నొకవైద్యశాల నిర్మించుచున్నారు కాని నిర్మాణస్థలము ఆరోగ్యమున కనుకూలముగలేవందుని ఈజాగీరు నవాబుగారికిని ప్రజలకును ఇష్టములేనట్లు తెలియుచున్నది.

రైలుబస్సు ఇదివరలో రాత్రిసమయమందు ఈగ్రామములోనిలుచుండెడిది—కాని నెలరోజులనుండి యిక్కడ వుండుటలేదు—ఈరోజు ౩-౧౦గంటలకు వెళ్లినబస్సు తిరిగి మరునాడు ఉదయం౧౧గంటలకుగాని రాదు. ఆకస్మిక అవసరముల కనుకూలమగుటకు స్వంతమోటారులు కూడాలేవు. ఇక్కడ బస్సునిలుచు స్థలముకూడాలేదు— ఎప్పుడైనను ఏదైననొక మైదానములోనే నిలుచుండును—స్త్రీలకనుకూలమగు వసతి ఏర్పాటులేదని మొత్తముపైనొక విశాలస్థలము—మోటారుగ్యారేజీకొరకై స్థలనిర్ణయమై నిర్మాణమున కనుమతికూడా దొరికినటుల తెలియుచున్నది—

## హుమ్నాబాదులో హిందూ మహమ్మదీయ సంఘర్షణము

బీదరు, అర్దిబెహస్తు ౨౯:—

నవ్వఖాను సుబాదిరులో చేరిన హుమ్నాబాదుయను తాలూకా గ్రామములో మొహరం ౧౨వ తేది [ఈరోజే హోలీవినోదములో ముఖ్యదినము] నాడు హోలీఆడుచున్నవారికి, మహమ్మదీయులకు ఒకచోటసంఘర్షణజరిగినది-తత్ఫలితముగ ౧ మహమ్మదీయునికి బలమగు గాయములు తగిలినటుల తెలియుచున్నది. తాత్కాలిక తాలూకాధికారియగు మౌల్వీ యూసుఫుఅలీఖాన్ గారు సంఘర్షణాస్థలమునకేలంచి ఇరుపక్షములవారిని స్వాధీనములోకి తీసుకొనిరి పోలీసువారు చాలినంతమంది లేనందున వారిసహాయమంతగాలేకుండెను. ఎట్లో అల్లరిని అణచేసి, గాయపడినవాని వాఙ్మూలముతీసికొనిరి. తగుచర్యతీసికొని విచారణ జర్పుచున్నారు. ప్రస్తుతము శాంతిగానేయున్నది.

### పిడుగుకు నలుగురి ఆహుతి

నాందేడు. అర్దిబెహస్తు ౨౯:—

ఈజిల్లాలో చేరిన ఖందావరతాలూకావరణలోని అష్టూరుఅనుగ్రామములో ప్రతిరోజు మబ్బులుగామండుటయు, అప్పుడప్పుడు ఇంచుమించువర్షించుటయు మెరుపు మెరసి పెద్దధ్వనులగలుగుటయు జరుగుచుండెను. నిన్నసాయంత్రము ౧౦ ౪-౫ లవేళ వర్షముకురియుచున్నప్పుడు అష్టూరుకు నాల్గుమైళ్లదూరమునగల నహాల్ గ్రామములో ఒకచేనులో పిడుగు అసమయమున వ్యవసాయపనులలో నిమగ్నులైయున్న నలుగురివ్యవసాయకులపై పడినందున వారు వెంటనే మరణించిరి. ఈనలుగురు మహారాష్ట్రులు.

## విద్యుచ్ఛక్తియంత్రమునకు నిప్పంటుకొనుట

ఔరంగాబాదు, అర్దిబెహస్తు ౨౯:—

ఔరంగాబాదు విద్యుచ్ఛక్తిభవనములో ఒకవంక ౩-౪ పెద్దపెద్ద క్రూడ్ ఆయిల్ డబ్బాలు పెట్టబడియుండెను. అందు మూడుడబ్బాలమాతలతియుటకు వేరుచేయుచుండగా నిప్పంటుకొనెను. సాధ్యమైనంతత్వరలో తక్కిన డబ్బాలను ప్రక్కకుతీసి, ౧౦౦ అడుగుల దూరమునగల నీటిహౌసునుండి నీరుతెచ్చి అగ్నిని ఆర్పివేసిరి. నష్టమంతగా వాటిల్లలేదు సినిమాలోవలె విద్యుచ్ఛక్తిలో భవనములో అగ్నిచల్లార్పుటకు పరికరములుగాని ఇసుకతో మరియు నీటితో నింపిన బకెట్లుగాని లేవు. అందుచేత అగ్నిచల్లార్పుటలో ఇబ్బందులు జరుగుచుండును.

## ఆపోహచే సంఘర్షణ

### ౩౭ మందికి గాయములు

లాతూరు, అర్దిబెహస్తు ౨౯:—

కొన్నిరోజులక్రితము స్థానిక మహమ్మదీయుడొకడు, మహమ్మదుయిస్మాయిల్ అను నొక పహిల్వానుతో చింగోలిఅను గ్రామమునకు పోవుచుండిరి. మార్గమధ్యమున కొందరు భూమివిషయమైన తగాదాయేర్పడి వివాదములు జరుగుచుండెను ఈసందర్భమున పైఇరువురు అచ్చటనే వచ్చుచుండుటగని వారుకూడా వీరిని చెదిరించుటకు వచ్చుచున్నారనే ఆపోహముచే వారిపైదాడివెడలిరి. అంతట ఇరుపక్షములలో ఘోరమైనసంఘర్షణ ప్రారంభమై తత్ఫలితముగ ౩౭మందిగాయపడిరి. అందు పహిల్వాని స్థితి ప్రమాదకరముగానున్నది. గాయపడినవారు వైద్యశాలకుచేర్చబడిరి.పోలీసు వారివిచారణ సాగుచున్నది.

# ప్రతిష్ఫ్యాక్టరి అగ్నికి ఆహుతి

లక్షలకొలది నష్టము

రాయచూరు, ఆర్డిబెహస్తు ౨౭:-

ఈరోజు మధ్యాహ్నము ౧౨ గంటలకు గౌరీశంకర ఫ్యాక్టరీకి నిప్పంటుకొనినది. అప్పుడు గాలి వడిగా వీచుచుండెను. ఫ్యాక్టరీ నలు వైపుల అనేక వెలగల ప్రత్తి నిలువ చేయబడియుండుటచే నలు వైపుల ఏకరీతిగా అగ్ని జ్వాలలు చెలరేగి ఫ్యాక్టరీ వద్దికి వెళ్లుట ఎవరికిని శక్యము కాలేదు. వేలకొలది జనము చుట్టుముట్టియుండిరి. అంత రాయచూరు మండలాధికారియగు నవాబు గౌసుయార్జంగు బహద్దరు గారు, రక్షకశాఖోద్యోగులు తమపటాలముతో వెంటనే ప్రమాదస్థలమునకు విచ్చేసిరి. అగ్ని చల్లార్పు పరికరములు లభించవందున చల్లార్చుటకు ఏవిధమునను వలనుపడలేదు. మండలాధికారిగారి ఆజ్ఞపై నల్లాలువదలి వేసి అగ్ని చల్లార్చుటలో కొంత ప్రయాసపడిరి. ౧౫ మైళ్ల దూరములోగల పర్మనీ అమృచోట ప్రత్యేకరక్షకపటాలము ఉండగా వారిని తంతిద్వారా సహాయార్థము పిలపించబడెను. కానివారు తొందరగా వచ్చుటకు సరియైన వాహనము లేక ... కొలినవిక తో రావలసివచ్చెను. అయినను వైజ్ ఆఫీసరు అరుయూనస్ ఖాన్ గారు తమపటాలముతో అతిగ కొలములో ప్రమాదస్థలమునకు వచ్చి ౩ కి వంచ నలేకుండ ప్రయత్నము చేసిరి. సుమారు ౧౦౦౦ల వెలగల ప్రత్తి కాలుచున్నది బయటికిలాగి వేసిరి- అంతేగాక కాలుచున్న ప్రత్తి మంగ్ల మైనివలన సుమారు రెండుగంటల కాలములో అగ్ని స్వాధీనమునకు తెచ్చుకొనిరి- నష్టము సుమారు రెండు లక్షలవరకు జరిగియుండినని స్పష్టముగా తెల్సిరి- నిలువయున్న మాలంతయు భీమా చేయబడినదని తెలియుచున్నది- రాయచూరులో పది ప్రెస్సులు, ఫ్యాక్టరీలు కలవు- కాని ప్రభుత్వపక్షమునగాని యజమానుల స్వంతమునుండిగాని నిప్పు చల్లార్పు యంత్రములేవు- నల్లాలేర్పడిన నుండి గ్రామమునగల బావులన్నియు మూసివేయబడినవి- అందుచే ఇటువంటి అపాయకాలకమును చాలాయిబ్బందులపాలు కావలసివచ్చుచున్నది- ఇట్టి వ్యాపారస్థలములందు నిప్పు చల్లార్పు యంత్రములనదియు ప్రత్యేకరక్షకపటాలము, వీరికి వాహనములు ఉండుట అత్యావసరము-

—————

# సంతాన నిరోధము అవసరమా?

రచయిత్రి:

శ్రీమతి బులుసు ప్రకాశమ్మగారు

"సంతాననిరోధము" అంటూ ఒకమాట ఈమధ్య అతిగా వినబడుతూంది. ఇదిమనదేశములో సుమారు రెండు, మూడు సంవత్సరాలనుంచి తలయెత్తింది. స్త్రీలసభలలోనూ ఇదిఒక ప్రధానమైన చర్చనీయాంశం. ఈసంగతి ఎత్తగానే ప్రారంభమయ్యే వాదవివాదాలతో సభరాత్రి తొమ్మిదిగంటలయినా కూడా ముగింపవీలగుటలేదు. బుద్ధిమంతులయిన అధ్యక్షిణులు దీనిని కార్యక్రమంలో కొసనివేస్తున్నారు. పురుషులుకూడా కొందరు బాహాటంగా తిరగడంలో పురోద్దేశములకు లెక్కచేయక దీనివిషయమై ప్రచారము చేస్తూనేవున్నారు. పత్రికలలో మూడు పాళ్లు ఇందుకుసంబంధించిన ప్రకటనలే. అర్థము శుభము తెలియని పదేండ్లపిల్లవాడు వానిని చదివి "అంటేఏమిటమ్మా?" అని తల్లిని అడిగితే వాడ్ని మరిపించలేక తల్లి ఉక్కిరిబిక్కిరి అవుతోంది.

పాశ్చాత్యులనుండి మనదేశమునకువచ్చుచున్న సుగంధవాయువులలో ఇదొకటి. సందర్భాసందర్భము లెలావున్నప్పటికీ, వారాచరించు విషయములకు మనము "భళా భళా" అని తలలూపుతున్నాము. ఇదిమనకి పరిపాటయింది అయితే, వారిస్థితులు వేరు. మనస్థితులు వేరు మనదేశపువేడి వారికిలేదు. వారిదేశపుచలిమనకిలేదు మనవారివలె అక్కడి ఆడువారు నలుగురుబిడ్డలతో ముసలివారు కారు. వారికి గృహనిర్వాహణమే ప్రధానముకాదు. ప్రతివారూ యేదోవిధముగా కష్టపడి కొంతొంత ఆర్జించుకుంటారు జీవితమంతా రెండోవారి అవసరంలేకుండా స్వేచ్ఛగావారు వెళ్ళదీసుకోగలరు. అందుచేత వారికి పిల్లలు కేవలం ఆనందమునకుమాత్రమే. మనదేశపుస్థితి అన్నివిధములబావికిన్వతిరేకము. అందుచేత సంతాననిరోధము హిందూస్త్రీలకు, హిందూ సంఘమునకూ ఎంతమాత్రము ఆచరణీయము కాదు.

"కుటుంబానికి నల్గురేసి పిల్లలు"

ఈమధ్య కొందరు మహానుభావులు "కావలసినవారు కావలసినంతమంది పిల్లలను కనండి ఎక్కువమంది బిడ్డలతో వేగలేక అవస్థపడేవారికే మేము చెప్పేవన్నిని, అదీగాక దేశములో జనాభా జనసంఖ్య అతిగా పెరిగిపోతోంది. దీనితో దారిద్ర్యము కూడా ఎక్కువవుతోంది. ఈసంతానాధిక్యతవలన స్త్రీల మరణములు కూడా ఎక్కువవుతున్నవి ఈఇబ్బందులన్నింటికి మంచివిదుకనై దేశము బాగుపడాలంటే ఒక్కటే ఉపాయము కనబడుతోంది. ఒక్కొక్క సంసారానికి నల్గురేసి చొప్పున పిల్లలు పుడుతూంటే చాలా బాగుంటుంది" అని చెప్పుతున్నారు.

కావాలన్నప్పుడు పిల్లలు వస్తారా?

సరేమితిగా ఇష్టానుసారము అవసరాన్నిబట్టే పిల్లలనుకనవచ్చు డబ్బులేక పిల్లలను పోషించలేకపోతే కనటం మానాలి. ప్రస్తుతానికి బాగానే వుంది.

మరిమనకు డబ్బు ఎప్పుడుంటుంది? పిల్లల అవసరమెప్పుడు? డబ్బువున్నప్పుడూ, పిల్లలు కావలసినప్పుడూ పిల్లలు అనగానే వస్తారా?-(వద్దంటే మానివట)-ఇదైమైనా మెడ్రాసుమరొక అవసరానికి ఓడబ్బుయెక్కువైనా తెప్పించుకునే వస్తువా?

ఇప్పుడుమనము ఆలోచించవలసిన సంగతులివి:-

స్త్రీకి సామాన్యముగా ఏవయస్సులో పిల్లలుకలుగుతారు? ఆరోజులలో వారి సంసారస్థితి సాధారణముగా ఏలావుంటుంది?

స్త్రీలు పిల్లలుపుట్టినా, పుట్టకపోయినా నలభైఏండ్లువచ్చేసరికి ముసలివారవుతున్నారు. (ఇది జనసామాన్యముమాట) పిల్లలుకలిగేది మూళ్ళయిదుఏండ్లవరకే ౨౦, ౨౫ ఏండ్లవయస్సులో పు వారికే అయిదారుగురుపిల్లలు త్వరగా కలిగితే కలగవమున్నూ-అలాగుకానివారికి లేకపోతే అసలేలేకపోవటమున్నూ-ఉంటే ఏఇద్దరో ముగ్గురో ఉండటంఅరుదు.

ఈవయసులో సామాన్యముగా స్త్రీ పురుషులు ఒకరియందుఒకరికి అతికామము ఐహికభోగములయందు అమితమైనకోరికలతో ఉంటారు. డబ్బుఏమీవుండదు. ఉద్యోగపు ప్రయత్నములలో ఉంటారు. ఈస్థితిలో పిల్లలు ఒయలు దేంతే అన్నిచిక్కులే కనుక ఈ సాధనములు వారుతప్పక స్వీకరిస్తారు కొన్నాళ్ళు వారు మంచిస్థితికివచ్చేసరికి స్త్రీకి ముప్ఫైయేండ్లు పైబడతాయి. అప్పుడుపిల్లలు కావాలనిపిస్తుంది మరి పిల్లలు అనగానే వస్తారా? ఒకవేళవచ్చినా ఎందరుకలుగుటకు అవకాశంవుంటుంది, ఇప్పటికాలపు ఆయుర్దాయములు మూస్తే ప్రమమముకయేళ్లై, స్త్రీకనలభై రాగానే వారిలో మెనపుగరించి, పెద్దవాళ్లు వాళ్ళకేమి అదృష్టవంతులు అనిఅంటున్నాము కదా! మరి ఈపిల్లలు పెద్దవారైనపిదప తల్లిదండ్రులకు ఏవిధముగ ఉపయోగించగలరు!

పిల్లలు లేకపోతే ఏదోలోటుగా వుంటుంది

స్త్రీపురుషులకు ఒకపదే ళ్లపాటు స్వేచ్ఛగా ఉన్నతరువాత బిడ్డలులేనియెడల ఏదోలోటు ఒకటి తెలుసుకున్నట్లు గాకనపడటం మొదలవుతుంది. పురుషుడు తీరిక అవడమే తడవు గా స్నేహితుడింటికివెళ్ళి అతనిపిల్లలతో కొంతకాలక్షేపంచేయడం మొదలెడతాడు. స్త్రీపామరమ్మ బిడ్డనుపాయివద్ద కూర్చోబెట్టుకుని ఆ ఓడ్డతో ఉల్లిబిల్లిసంభాషణచేస్తూ వంటచేయడము కూడావుంటుంది, ఆపిల్లఏదిపాడు చేసినా ఎంతో విధాయకులాలుగా సవరించుకుంటుంది. భార్యాభర్తలు ఒకచోటకూర్చొగానే వారిమాటలన్నీ ఈపరాయిబిడ్డలను గురించినవే, ఇంతలో ఒకవేళ ఆపిల్లలు వాళ్ళబంధువులయింటికి వెళ్లితే వీరికిఆదేబెంగ. ఈలాంటిఅవస్థలలో వీరికి పిల్లలుకావాలి పిల్లలు అనగానే వస్తారా! కాల

## స్పెయినులో యుద్ధము

లండన్, ఏప్రిల్ 3

స్పెయిను యుద్ధములో ఉభయ పక్షములవారును మేము ముందుకు వచ్చితిమి, మేము గెలిచితిమి, అని పరస్పరయుద్ధ వార్తలంపుచున్నారు. కార్డోబా రాష్ట్రములో పోజో బ్లాంకో రణరంగమున ప్రభుత్వ సేనలు 3 మైళ్లు ముందుకు వచ్చినవి. ఇంతవరకును విద్రోహులకు చాల ఉపయోగపడుచుండిన కార్డోబా రైలు మార్గమును ప్రభుత్వ సైన్యములు సమీపించుచున్నవి.

### స్పెయిను సరిహద్దు

లండన్, ఏప్రిలు 3

ఫ్రెంచి సరిహద్దు దాటి, ఫ్రెంచి వాలంటీర్లు గాని ఫ్రెంచి యుద్ధపరికరములు గాని స్పెయిను దేశమునకు పోవుచున్నట్లు కనబడుట లేదని ఆ ప్రాంతములలో సంచారము చేయుచున్న రూటరు విలేఖరి తెలుపుచున్నాడు. పోలీసులు, కావలివారు కాపలా చేయుచున్నారట. స్పెయిను, ఫ్రాన్సుల మధ్య ఎల్లకు సమీపమున స్పెయిను దేశీయ పట్టణములలో తినుటకు తిండి లేదు. ఏలనన అక్కడివారు ఆహారపదార్థములను కొనుటకు సామాన్యముగా కేర్బరీ అను ఫ్రెంచి గ్రామమునకు వచ్చుచుందురు. ఇప్పుడు కేవలము భోజనసామగ్రి కొనుటకే వారిట్లు వచ్చుటయని ఫ్రెంచి అధికార్లు సందేహపడుచున్నారు.

కౌంటెస్ బ్రేరీడీన్ గారును వారితో నున్న వారలును స్పెయిను దేశమును చూడబోయిరి. బిల్బావో రంగమున వీరి కండ్లయెదుటనే సెయింట్ మేకీచర్చి ద్వారమువద్ద విద్రోహ విమానములనుండి బాంబులు విసరి, స్త్రీలమీదను, బిడ్డలమీదను మరతుపాకులు కాల్చిరి.

హెండాయి, ఏప్రిల్ 3

కార్బియా పర్వతము వద్ద మరలతీవ్ర యుద్ధము సాగుచున్నది. బాస్కులు మకల విద్రోహ సైన్యములతో పోరిరి. కాని వెనుకకు తరుమకొట్టబడిరి. జనరల్ మోలా గారి నాయకత్వమున నడచుచున్న సేన బాస్కు రణరంగము మధ్యభాగమున ప్రభుత్వ సైన్యమును నెట్టుకొనిపోయి ఇటు ర్మోడియా చేరగలిగినది. ఇలు ర్మోడియా బిల్బావో వద్దనుండి ఇరువది అయిదు మైళ్ల దూరములో నున్నది.

మాడ్రిడ్, ఏప్రిల్ 3

యుద్ధము చేయుటకు తగిన వయస్సుగల స్పెయిను ప్రజలు ప్రస్తుతము యే దేశములో నివసించుచున్నను వచ్చి, స్వదేశ సంరక్షణకు తోడ్పడవలెనని పిలుచుటకు స్పెయిను ప్రభుత్వము వారు, తీర్మానించుకొనిరి.

## బ్రిటనులో రోడ్లపై ప్రమాదములు

బ్రిటనులో ౧౯౩౬లో రోడ్లమీద జరిగిన ప్రమాదముల వల్ల ౬౫౬౧ మంది చచ్చిపోయిరి. ౨౨౭౧౫౯ గురికి దెబ్బలు తగిలెను.

వారిలో మూడు వేలు పాదచారులు, వెయ్యి మంది సైకిలిస్టులు రెండువేలు మోటారు కారుల వల్ల అందులో ప్రయివేటు మోటారు కారుల వల్ల చచ్చిరి.

## సివిల్ ప్రొసీజరుకోడ్డు సవరణ చట్టము మోదించబడుట

న్యూఢిల్లీ, ఏప్రిల్ 3

సివిల్ ప్రొసీజరుకోడ్డు సవరణ చట్టమును కౌన్సిల్ అఫ్ స్టేట్ సభవారామోదించిరి.

## సింధురాష్ట్రపు అసెంబ్లీ ప్రథమ సమావేశము

సింధురాష్ట్రపు క్రొత్త శాసనసభయగు (అసెంబ్లీ) ఏప్రిలు ౨౭వ తేదిని సమావేశమగును. సింధు గవర్నరు సభలో ఉపన్యసించును. సభ్యులు రాజభక్తి ప్రమాణము చేయుట, అగ్రాసనాధిపతిని ఎన్నుకొనుట, మంత్రుల జీతములను నిర్ణయించుట జరుగును.

## రష్యా బంగారము అమ్ముచుండుట

లండన్, ఏప్రిల్ ౨

రష్యాదేశము బ్రిటనుకు, ఐర్లెండునకు ౧౦౦౦ లక్షల పౌనుల బంగారము ఎగుమతి చేసినది. ఇంకను ౨౫౦ లక్షల పౌనులు బంగారము పంపుటకు సిద్ధముగానున్నది. ఇట్లు రష్యానుండి బంగారము ఎందుకు ఎగుమతి చేయబడుచున్నదో తెలియక లండనులో ప్రజలు కలవరపడుచున్నారు. రష్యా యీ బంగారమునంతటిని న్యూయార్కుకు పంపి దానికి బదులు డాలర్లు తీసికొనుచున్నది. దీనిని బట్టి యుద్ధము జరిగెడి పరిస్థితులలో అవసరమగు కావలసినన్ని డాలర్లను నిలువచేసియుంచవలయునన్న అభిప్రాయము తేలుచున్నది.

రష్యాలో ౧౨౦౦౦ లక్షల పౌనులు విలువగల బంగారము నిలువయున్నది. రష్యా ప్రతి సంవత్సరమును ౫౫౦ లక్షల పౌనుల బంగారము తీయబడుచున్నది దీనినంతటిని రష్యా ఇతర దేశములకు అమ్మివేసి తన డాలర్ల బలము నెక్కువ చేసికొనునని పురజనులు తలచుచున్నారు.

## త్యాగరాజ మహోత్సవము

### గొప్ప సంగీత విద్వాంసుల కార్యక్రమము

ఎప్పటివలెనే ఈ ఉత్సవములు కొవికూడెను లోని తుంగభద్రమందు జరుగును. దాని కార్యక్రమమిక్రిందివిధమున నుండునని ఆ ఉత్సవపు ఏర్పాట్లకు బాధ్యతవహించు సంఘముయొక్క ఉపాధ్యక్షులగు బి. నరసింహం అయ్యంగారు, యం. ఏ; బి. యల్ గారు, తెల్పుచున్నారు:—

౮—౪—౧౯౩౭ గురువారం [ ఈరోజు ] సాయంకాలం ౬ గం. లకు శ్రీచౌడయ్యను, మైసూరు ఆస్థాన విద్వాంసులు గారును, వారిసోదరులును ఫిడేలు. ౯—౪—౧౯౩౭ శుక్రవారం సాయంకాలము ౬ గం. లకు వేణుగానం రాజారాం అయ్యర్ [ మాయవరం ]—వేణుగానము. ౧౦—౪—౧౯౩౭ శనివారం సాయం. ౬ గం. లకు ముసిరి సుబ్రహ్మణ్యయ్యర్—గాత్రము ౧౧—౪—౧౯౩౭ ఆదివారం సాయం. ౬ గం. లకు డి. కె. పట్టమ్మాళ్ (మద్రాసు), వారిపార్టీతో సహా—గాత్రము, ౧౨—౪—౧౯౩౭ సాయం ౬ గం. లకు మైలాపూరు గోపు [ రాజరామయ్యర్ ] గారు—గాత్రము. ౧౩—౪—౧౯౩౭ సాయం. ౬ గం రాయపోలు సుబ్రహ్మణ్యం భాగవతార్ గారు [ నెల్లూరు ] గాని నౌమూరు విశ్వనాథశాస్త్రి [ బెజవాడ ] గాని తెలుగు హరికథా కాలక్షేపము చేతురు. ౧౪—౪—౧౯౩౭ సాయం. ౬ గం. లకు హరి నాగభూషణం గారు—గాత్రము సోలో వయొలిన్.

పైజెప్పిన విద్వాంసులతో కూడా వేణు నాయకర్! పాలఘాట్ రామచంద్రవరా హలార్ ముత్తుస్వామి అయ్యర్ [ వయొలిన్ ] గార్లు ఉందురు.

కార్యనిర్వాహకులు బాలభారతియగు గిరికుమారి ( మైసూరు ) గారిని ప్రార్థించుచున్నారు. వారంగీకరించిన తర్వాత కార్యక్రమముల వేరుగా ప్రకటించబడును ఈ కార్యక్రమములో మార్పులు జరుపుటకు కార్యనిర్వాహకుల కధికారము గలదు.

## గాడిదలకు సారాయితో స్నానము

బ్రెజిల్ దేశములో ఉత్తర ప్రాంతమున పియూరా రాష్ట్రములో చాల కాలమునుండి వర్షము లేక కరవుగానుండి ఇపుడే వర్షము కురిసెను ఈ సంతోషములోను. ఇంత కాలముగా నీరులేకున్నను గాడిదలు జీవించగలిగినందుకు మెచ్చుకొనియు రైతులు గాడిదలపై సారాయి పోసి పునస్కరించుచు ఎగురుచున్నారు— ఇది వారలలో ఆచారమట—

## నూతనరాజ్యాంగ శాసన కాష్ఠదహన కర్మ

ఏప్రిలు ౧ వ తేదినాడు దేశమంతటను హర్తాళులు జరిగియుండెగదా! ఈ హర్తాళులన్నిచోట్లను శాంతముగాను ఎక్కువ ప్రచారము ఎట్టి బలవంతము గాని లేక జరిగియుండుట విశేషము ఈ సందర్భమున పూనాలో జరిగిన ఒక చిత్రము గమనించదగియున్నది. అక్కడ యువజనసంఘము వారు నూతనభారత రాజ్యాంగశాసన పుస్తకముయొక్క ప్రతినొకదానిని వల్లకాడులో కట్టె కాల్చివేసిరి. కాంగ్రెసు నాయకులు మంత్రివర్గమేర్పరుచ నిరాకరించిన తర్వాత, ఇపుడేర్పరచబడిన మంత్రివర్గములో తిమపక్షీయుడగు జమ్నదాసు మెహతా గారిని చేరనిచ్చినందుకు డెమొక్రాటిక్ స్వరాజ్యపక్షము వారిపై సభలో జనులకు కోపము పెరిగెను. అందుచే సభకు వచ్చియుండిన ఇరువురు డెమొక్రాటిక్ స్వరాజ్యపక్షము వారిని వారలు పట్టుకొని కొంతకాయకు దిచేసి పంపిరి. ఇంతకంటె ఎక్కువ అశాంతులు జరుగలేదు.

### పిచ్చిపుల్లాయిల దినము

ఇదే ఏప్రిలు ౧ వాడు మదరాసులో హర్తాళు సందర్భమున జరిగిన సభయందు శ్రీయుత సి. రాజగోపాలాచారిగారుపన్యసించుచు ఇంగ్లీషువారలకు ఏప్రిలు ౧ వ తేది పిచ్చిపుల్లయ్యల దినమనియు (All Fools' Day) కాంగ్రెసువారు ఆరోజి అమలుకువచ్చు రాజ్యాంగశాసనము క్రింద మంత్రిపదవులకంగీకరించుచో వారలను పిచ్చిపుల్లయ్యలనగలరనియు, ప్రభుత్వము వారిదయవల్ల కాంగ్రెసు వారికి ఆ పేరుతప్పి ప్రభుత్వము వారికేదక్కినదనియు చెప్పిరి ఎంత అవమానము!

ఇదే సందర్భములో కాశీలో జరిగిన సభలోను పన్యసించుచు పండితమదన మోహన మాలవ్యాగారు విదేశీయులింకను ఈ దేశములో పాలనచేయుచుండుట భారతీయులకు సిగ్గుపడదగిన విషయమనియు, ఇప్పటి రాజ్యాంగము పోయి భారతదేశ ప్రజలచే ఎన్నుకొనబడిన ప్రతినిధులచే నిర్మించబడిన క్రొత్త రాజ్యాంగము వచ్చువంతవరకు భారతీయుడైనవాడు తృప్తిపొందరాదనియు చెప్పిరి.

## గ్రామోద్యోగీయుల కష్టములు

మార్చి ౨౭ తేది సాయంత్రము ఇచ్ఛాపురం తాలూకా ప్రొప్రయిటరీయెస్టేటు గ్రామోద్యోగీయుల సంఘము వారు శాసన ఎస్టేటు కొల్లాం గ్రామంలో తిరుమల పెద్దింటి పద్మనాభస్వామిగారి యాధిపత్యమున సమావేశమైరి. ౪౦ మంది గ్రామోద్యోగీయులు సకమవిచ్చేసిరి. దైవప్రార్థనతో సభప్రారంభమై యుపన్యాసములు, కార్యనిర్వాహకవర్గము నెన్నుకొనుట జరిగినపిదప కొన్ని తీర్మానములు కావింపబడెను.

గవర్నమెంటు గ్రామమునసబు కరణముల తో పాటు ప్రొప్రయిటరీయెస్టేటు గ్రామాదుల మునసబు కరణముల కన్ని విషయములలో సమానప్రతిపత్తి నీయవలయునని గవర్నమెంటు వారిని సభవారు కోరుచున్నారు

గ్రామాధికారులు జమీందారులకు రావలసి నడిక్రీల సొమ్ము వసూలు చేయజాలనియెడల గాని, తాము యెస్టేటుకు బాకీయున్న శిస్తుల చెల్లింపవలసియున్న గాని వారిపయిచర్యతీసికొనుటకు గట్టములో గాని బోర్డుస్టాండింగు ఆర్డరులలో గాని ఎట్టి ఏర్పాటు లేనప్పటికీ ఆట్టి గ్రామాధికారులను యెస్టేటువారి సిఫార్సుపై రివిన్యూఅధికారులు శిక్షించుట న్యాయబద్ధమై యుండలేదనియు, చట్టవిరుద్ధమనియు, అట్టి అన్యాయము జరుగకుండ చూడవలెననియు జిల్లా కలెక్టరుగారిని సభాయుక్తులైన గవర్నరుగారిని యీసభవారు ప్రార్థించుచున్నారు.

రిజిష్టరుమెనరు గ్రామోద్యోగి ౨౧ సంవత్సరములలోగా టెక్స్టుపాసుకానిచో యుద్యో

## వైశ్య సోదరులకు మనవి

౩—౪—౧౯౩౭

మా దేశములో అన్ని జాతులు వర్ధిల్లవృద్ధికిరావలయునని యుద్యోగములకు సాంఘిక, మత, ఆర్థికవిషయము లన్నిటిలోను ప్రజల యభిప్రాయములు మారుచున్నవి. ఇటీవల వైజాంబాష్ట్రములో క్రొత్తసలుపుమన్న రెడ్డి, మున్నూరు, వారుకూడ నేల ప్రతిజాతియు ఔన్నత్యమునకు వచ్చుచున్నారు. ఆత్మగౌరవముల వెదయుచున్నారు. సంఘదురాచారముల నిర్మూలించుచున్నారు.

వైశ్యులు ద్విజులు, అగ్రజాతిలో నొకరయ్యును, యింతవరకు కూపస్థ మండూకమువలెనున్నారు. ఇతర సంఘములు వీరిని నీచముగ చూచుచున్నవి. వాటి వైశ్యరత్నములకు పేరులను బిరుదాంకితులు నేడు ఖాళిసికరేటుడబ్బాలు షావుకారు అమ్మకొనుచున్నారు. పూర్వమునుండి దాతృత్వమునకు వీరలకు పెట్టినది పేరు. ఈ కాలమున గూడ అట్టి నామము సార్థక పరచుకొనుచున్నారు కాని యుక్తాయుక్తములు, పాత్రాపాత్రములు మాత్రము గమనించుటలేదు. ఇన్ని టికిమూలము నాగరికత, విద్యావివేకములు లేకుండుటయె.

ఇట్టి క్లిష్టపరిస్థితులయందు స్వజాతిని అవమానమునుండి నుద్ధరింపవలయునను నుద్దేశము శ్రీయుత నాగేశు కృష్ణారావుగారికి కలిగినది. ౨౫ సంవత్సరముల యువకుడు—చెన్నూరునివాసి, కృతికర్త—ఇంత చిన్న వయస్సు లో పరనివాసియగు నాతనికిట్టి తలంపు కలుగుట కొందరికి వింతగాతోచవచ్చును కాని స్వకులాభిమానమే వారికైజికము— ఇదియేగాక పరోపకారార్థం ఇదంశరీరమ్ అను లోకోక్తి ప్రకారము బాల్యమునుండి కొందరికో గొప్పగనో పరులసేవ చేయుచున్నారు. వారి స్వార్థత్యాగము ఎంతయయి వకొనియాడదగినది. రావుగారు స్వకులోద్ధరణ కంకణులై కార్యము పకుబూనుకొనిరి. ఒకటిరెండు సమావేశములనంతరము తల్పిలితముగ నేడు స్వమగాంచుచున్న ఆర్యవైశ్య తాత్కాలిక సంఘము స్థాపించిరి. ఇంతియేకాక వాసవిగ్రంథాలయముగూడ నెలకొల్పిరి. మూడు భాగ్య సమావేశములు, వైశ్యజన సంఖ్య ఎక్కువగాయున్న ప్రదేశములయందు ఏర్పఱచి, తాత్కాలిక సంఘము స్థిరపరచుటయు, వైశ్యవిద్యార్థులకు ఒకవసతిగృహము ఏర్పఱచుటయు, తద్వారా విద్యావ్యాప్తి చేయవలయుననియు, కేంద్ర సంఘముఒకటి ఏర్పాటు చేసి, ప్రతిసంవత్సరము మన సభలు జరుగ నేర్పాటు చేయుట వీరి ముఖ్యోద్దేశములు—ఇంతియేగాక మత, దురాచారముల రూపుమాపి అంధకారనిమగ్నమగు వైశ్యజాతి నుద్ధరించుటకూడ!

ఓ వైశ్యసోదరులారా!! కృష్ణారావుగారిసలహాలపై మీరునడుచుకొనిన మనకులము ప్రఖ్యాతికిరాగలదు, మనది ఒకజాతియని నలుగురిఎదుట వ్రాక్కుచ్చుచు, సగర్వముగ సంచరించుటకు అవకాశము కలుగును—రావుగారికన్న మరొకవ్యక్తి మనసంఘములందు పాటుపడువారు లేరని ఖండితముగ చెప్పగలను. (ఒకరు)

గమిమ్మరాదనియు బయటవారిని నియమించుటకీవిధియవసరము లేదనియు గలరూల్సు పవరతగల వారికే నేకులకు బాధకరమైయున్నందున పదరు నిర్బంధమును తొలగింపవలయుననియు సభవారు కోరుచున్నారు.

రిజిష్టరుమెనరుకు మేజరయినపిదప నియమించుటలో యెస్టేటువారి నామినేషను కోరుట అనవసరమని యీసభవారు విన్నవించుచున్నారు.

తాలూకాకచేరీలలో గ్రామోద్యోగులు, పార్టీలతో కూడుకొనకుండా ప్రత్యేకంగా వుండుటకు వీలయినస్థానమొకటి నిర్మింపవలయునని యీసభవారు కోరుచున్నారు.

౨ వ పేజీ తరువాయి

టివాండిపెదలుపలుకు భారతరాజకీయ రంగము ను తల్లక్రిందులు చేయగలదు. మహాత్ముడు కడు వృద్ధుడగుచున్నాడు; కాని అతని ఆధిపత్యము వందు సమర్థులగు వీరనాయకుల సైన్యము బయలుదేరినది. ఈ సైన్యము ఏ ఆటంకమును గాని లక్ష్యపెట్టదు వీరు సంపూర్ణ స్వాతంత్ర్యమును అభిలషించుచున్నారు—వీరిలో జవహరులాలు వంటి యువకుడును పని చేయుచున్నాడు: వీరు కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయములలో విద్య నభ్యసించియున్నారు—పండిత జవహరులాలు మహనీయుడు ఏడుసార్లు కారాగారశిక్ష పొందెను. వీరు తమ జీవితములందలి పదిసంవత్సరములు కారాగారములలో గడిపిరి—వీరు నేడు కారాగారములయందున్నారు—ఎప్పుడు బోయినను ప్రవసింపుటకు జంకరు; లక్షలకొలది జనులు వీరిని దర్శించుటకు ప్రయత్నింతురు—నేను అపోజిషనుయొక్క పార్లమెంటరీ లీడర్ భూలాభాయి దేశాయినిగూడ సందర్శించుటకు అవకాశము లభించెను—కొంతసేపు సంభాషించితిని—జనసామాన్యులలో నీయన కీర్తి యతని యుపన్యాసము లవిని యుండితిని—గ్రాంధిక శైలిలో నెంతయు నాకర్షించినవి. వీరును కారాగారశిక్ష ననుభవించిన అసాధారణవ్యక్తిత్వముగల నాయకులు—

ఇంతటి గొప్ప నాయకులు నైతము దాస్యశృంఖలముల ధరించి దాస్యములలో దగుల్కొనియున్నారు— ఏదిఏమైనను ప్రజలయొక్క సంపూర్ణ పరిణామమును బడయనున్నది—ఈ ప్రజాహితదీక్ష, కొన్ని రాష్ట్రములలో గృహపరిశ్రమల నుద్ధరింప సమకట్టినది—

ఎచ్చటనైతే హిందూదేశములో దారిద్ర్యము నుజూచితిమో, అచ్చటనే సౌఖ్యసంపదల కాశ్రయస్థానములగు హర్మ్యములనుగూడ జూచితిమి. మేము మ. ఘ. వ. నిజాము ప్రభువుగారి వజ్రవైఢూర్యములనుజూచితిమి—వారి రాజభవనమునందు భోజనభాగ్యము లభించెను— సిమ్లలో మైసూరు ప్రభువు సత్కరించెను. మేము ప్రాచీన చారిత్రికప్రదేశములు తాజమహాలు (ఆగ్రా), ఖుతుబుమీనారు ఢిల్లిని సందర్శించి, భారత ప్రాచీన ప్రతిభను స్మరించితిమి—

వేయేల హిందూదేశము దురదృష్టవశాత్తు అజ్ఞానదారిద్ర్యనిద్రలో నున్నను, త్వరగా మేల్కొనుచున్నది.

———

# సెంట్రల్ బ్యాంకు ఆఫ్ ఇండియా, లిమిటెడ్

హెడ్ ఆఫీసు బొంబాయి

ఈ సంవత్సరము బ్యాంకుయొక్క 1911–1936 సిల్వరుజూబిలీ జరుగును. 25 సంవత్సరములు అభివృద్ధికరముగ బ్యాంకింగు మ. ఘ. వ. నైజాంరాష్ట్రములోని బ్రాంచీలు హైదరాబాదు, సికింద్రాబాదు, ఔరంగాబాదు, జాల్నా, సెలూ, రాయచూరు, లాతూరు, వరంగల్

ఇతర బ్రాంచీలు:— ఆగ్రా. అహమదాబాదు. అమృతసర్, కలకత్తా, కౌన్పూరు కొచ్చిన్ కోయంబత్తూరు. ఢిల్లీ, ఢక్కా, యెర్నాకులం, గోరకుపూరు, హాపూరు, హైదరాబాదు (సింధు) జామనగరు, కరాచి. లాహోరు. లక్నో లాయల్‌పూరు. మద్రాసు. నారాయణగంజ. మద్రాస. రంగూన్. షోలాపూరు. సుక్కూరు. సర్‌గోదా. సూరత్—

యివిగాక దగ్గిరదగ్గిర ౮౦ సబుఆఫీసులు, పే ఆఫీసులు ఇండియా మొత్తముమీదనున్నవి.

దక్షిణాయిండియా సెంటరులలో 40 ఏజన్సీ ఏర్పాట్లు వున్నవి. అన్నివిధములైన బ్యాంకింగు పనులు జరుపబడును.

ఇ. థామస్
ఏజంటు. హైదరాబాదు

# ఆర్. గోపాల్

జనరల్ క్యాప్ మర్చంటు

వులెన్ సూటర్స్, వులెన్ అండ్ కాటన్ సాక్స్, బ్లాంకెట్స్ మొదలైన అన్ని రకములు కాటన్ అండ్ సిల్కులలో, (ఫాక్స్ అన్నిరకములు, సిల్కు అండ్ కాటన్ దస్తీలు, ఫర్ ఫోల్డింగ్, చెస్టర్ ఫోల్డింగ్, సాలార్‌జంగ్ షేప్, కాశ్మీర్ వులెన్ మొదలైన అన్నిరకముల టోపీలు సిద్ధముగా దొరకును.

ముఖ్యముగా గమనింపుము:—ఆర్డర్లపై కోరినప్రకారం టోపీలనుయిరువదినాలుగు గంటలలో తయారుచేసి యివ్వగలము.

ఆర్. గోపాల్
జనరల్ క్యాప్ మర్చంటు
బస్ స్టాండ్ కోఠీ, సుల్తాన్‌బజార్, హైదరాబాద్ (దక్షిణ

హిజ్ మాస్టర్సు వాయిస్ గ్రామఫోనులలో
## తగ్గింపు ధరలు



| పేరు | మాడల్ నంబరు | మొదటివెల | తగ్గింపువెల |
|---|---|---|---|
| పోర్టబుల్ | ౧౦౨ | రు ౧౦౦ లు | రు ౭౦ లు |
| రంగులలో చర్మముకప్పుగలది | ,, | ,, ౧౧౦ ,, | ,, ౯౦ ,, |
| మంచి ఫేషనులో | ,, | ,, ౧౧౦ ,, | ,, ౧౧౦ ,, |

అన్ని రకముల తెలుగుగ్రామఫోను రికార్డులు మావద్దదొరకును.
స్త్రీలువచ్చి చూచుటకు ప్రత్యేకమగు ఏర్పాటుగలదు.

బి. జి. చిమల్గి
జాంబాగు, హైదరాబాదు దక్కన్.

# నీమ్‌టూత్ పేస్టు

ఇదిచాల విశేషగుణము గలిగిన పేస్టు. పండ్లను శుభ్రముగాను, గట్టిగాను యుంచి, చిగుళ్లనుగట్టిపరచును. చిగుళ్ళలో రక్తముకారుట, దుర్వాసనపోగొట్టి వజ్ర తుల్యముగా చేయును. నీమ్‌టూత్ పేస్టును నెలరోజులువాడి దానిగుణమును గమనింపుడు. దంతధావనకు వేపపుల్లఎంతమంచిదో అందరికి తెలియును. వేపయందలిసారమే ముఖ్యముగా యిందుగలదు.

## మార్గొసం ఆయింటుమెంటు

అమూల్యమైన ఓషధులనుండి తయారుచేయబడి బాధానివారణయందు అసమానమైనది. తీట, గజ్జి, కురుపులు, తామర, వ్రణములు, మొటిమలు మొదలైన అన్ని చర్మవ్యాధులను పోగొట్టుటలో సాటిలేనిది.

## నూ పెయిన్ బాం

సర్వవిధములైన వాతనొప్పులు, నడుమునొప్పులు తలనొప్పి త్రుటికాలములో పోగొట్టును.

ది కలకత్తా కెమికల్ కంపెనీ, లిమిటెడ్, వారిచే
గుప్తపద్ధతిని తయారుచేయబడినది.

దొరకుస్థలము:—

## కాథేవార్ స్టోర్సు

బ్రాంచి, గుల్బర్గా దక్కన్.   సుల్తాన్ బజారు, హైదరాబాదు—దక్కన్.



అందమునకు ఆరోగ్యమునకు
మార్గోసబ్బు వాడుడు.

